శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారి ముద్రిత గ్రంథములు

1. శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యాంధ్రీకరణము రూ. 116 -
2. శ్రీ నీలకంఠీయ భగవద్గీతా భాష్యాంధ్రీకరణము రూ. 80 -
3. శ్రీ నీలకంఠీయ ఉపనిషద్భాష్యాంధ్రీకరణ ప్ర.భా. రూ. 60 -
4. శ్రీ శివసహస్రనామ రహస్యార్థము రూ. 30 -
5. శ్రీ శివతత్త్వ రహస్యము (108 శివనామార్థము) రూ. 15 -
6. శ్రీ ఈశ్వరగీత- సాంద్రతాత్పర్యము రూ. 21 -
7. శ్రీ నందికేశ్వర పురాణము సాంద్రతాత్పర్యము రూ. 40 -
8. శ్రీ దేవీనవరాత్ర సంక్షిప్త పూజావిధానము
9. శ్రీ శివమహాస్తోత్రము-సాంద్రతాత్పర్యము రూ. 5 -
10. ఆరాధనవిధి (ఆరాధ్యులది) రూ. 12 -
11. జగద్గురు శ్రీ నీలకంఠాచార్య పూజాదికము- ... -- ఉచితము
12. శ్రీ ప్రణవ శివ-షడక్షరీ-మహామంత్ర ప్రాశస్త్యము -- ,,
13. శ్రీ మహాలక్ష్మి పూజావిధానము రూ. 11 -
14. శ్రీ భద్రకాళీ పూజావిధానము రూ. 11 -
15. గురుశిష్య సంవాదము రూ. 5 -
16. శ్రీ శివపంచాక్షరీ పటము-మూడురంగులలో రూ. 5 -

ఇంకను సహస్రకమలార్చన, వైదికమత సామరస్యము, కఠోపనిషత్తు, సంతోషిణీమాతవ్రతము, శివపూజామంత్రార్థము, శివకవచము సాంద్రతాత్పర్యము, పార్థివలింగస్తోత్రము, శ్రౌతశైవసంధ్యావందనము, వైదిక శివపూజావిధానము, శివభజనశ్లోకములు (భజగోవిందం మాదిరి) ఇత్యాదులు గలవు.

పై 16 పుస్తకములు ఒకేసారి తెప్పించుకొనువారికి 400 రూ॥లకే పంపబడును. అడ్వాన్సు 200 రూ॥లు పంపవలెను. పోస్టేజి అదనము.

వలయువారు- శివశ్రీ॥ నిర్మల హరదత్త (శివకిరణ) శర్మ, సర్వమంగళా-శివవిజ్ఞాన-సదనము, (120) 184/A, వెస్ట్‌మారేడుపల్లి-సికింద్రాబాద్-26.

ఓమ్

# శ్రీ ప్రణవ శివ షడక్షరీ మహామంత్ర ప్రాశస్త్యము






...ము, సంకలనము, ప్రకాశనము

**ఆ... మ్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**

ప్రేరణ, అనుమోదము

శ్రీ శైవమహాపీఠ పండితమండలి, మరియు కార్యకర్తృ
ప్రముఖవర్గము - హైదరాబాద్.

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ ప్రణవ శివ షడక్షరీ మహామంత్ర ప్రాశస్త్యము

పరిష్కారము, ప్రాశస్త్యము, ప్రశ్నోత్తర నిరూపణము అపార్థ నిరాకరణము, శబ్దదోష నిర్దేశము, కర్మభోగ వివరణము, ప్రతివాది ప్రదర్శిత ప్రమాణ దౌర్బల్యము, శ్రుతి స్మృతి మహాపురాణ గత ప్రమాణబాహుళ్యసముల్లేఖనాదికము మానవుడు, మతము ఇత్యాది వ్యాసరచనయు,

అశీతివయోవృద్ధులు, ఆసన్న అర్ధశత గ్రంధకర్తలునగు

**శివశ్రీ॥ నిర్మలశంకరశాస్త్రి ఆరాధ్యులు**

సర్వమంగళా-శివ విజ్ఞాన-సదనము,

120 184/A, వెస్ట్ మారేడుపల్లి,

సికిందరాబాద్-500 026, ఆం.ప్ర.



గురుచరేశ్వర నిస్స్వార్థ సమర్పణము.

ప్రథమ ముద్రణ - కాపీలు 500,

శ్రీ ధాతృ సం॥ ఆశ్వయుజమాసము–శుక్లపక్షము- పూర్ణిమ,
1996, అక్టోబర్ 26,



వలయువారు :

శివశ్రీ॥ నిర్మల హరదత్త (శివకిరణ) శర్మ,
(120) 184 A, సర్వమంగళా-శివవిజ్ఞాన-సదనము,
వెస్ట్ మారేడుపల్లి, సికిందరాబాద్-500026, ఆం.ప్ర.

సవరణ-24వ పేజీలో 11వ పంక్తియందు 65వ శ్లోకమున మొదటిపాదమునందు "స్త్రాంసా" అనుదానిని "స్త్రాసాం" అని చదువుకొనవలెను.

ముద్రణ :

శివాజీ ప్రెస్,
4-4-53, గంజ్ బజార్,
సికింద్రాబాద్-3.

ఓమ్

# జగద్గురు శ్రీ మల్లికార్జున పండితారాధ్యులవారు

(గ్రంధకర్తగారి మూలపురుషులు)



గౌతమస గోత్రము, త్రిలింగదేశము,

అద్వితీయ ప్రతివాది భయంకర శ్రౌతశైవ (ఆరాధ్య)

మత ప్రచారకాగ్రగణ్యులు.

ఓం నమో భగవతే సదాశివాయ

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

అస్మచ్ఛ్రీ బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యః పరమ గురుభ్యో నమోనమః ॥ శ్రీ వేదవ్యాస శ్రీ నీలకంఠాచార్య, శ్రీ నాగలింగశాస్త్రిభ్యో గురుభ్యో నమః

# ముందు మాట

# శ్రీ శ్రౌతశైవ (ఆరాధ్య) సంప్రదాయ పరిష్కారము

ఈ వ్రాత-సాధారణపండితులను మెప్పించుటకు గాదు. శాస్త్రీయ మహాపండితులు స్వయంనిర్ణయ స్వాతంత్ర్యము గలవారు గాన వారికొఱకును గాదు శైవు (ఆరాధ్యు) లను దేశకాలపాత్రోచితముగ మేలుకొలుపుటకు, పూర్వయుగ ప్రమాణముల సామంజస్యమును పరిశీలించి కలియుగ శైవు లకు శైవమత సంప్రదాయమునందు శ్రద్ధా భక్తులను కలిగించి శైవమతము-కొన్నిమార్పులతోనానాటికి పెంపొందవలెననియు ఇందుమూలముగ శైవ మహాపీఠము-స్థానధన సంఘబలము కలిగి-పూర్వాధికముగ కార్యోన్ముఖమునై-ఇతరమతముల వారికి గూడ ఆదర్శము కావలెనను సదభిప్రాయముతో వ్రాయుమని-ఆంధ్రుల ఏకైక దైవమగు శ్రీశైలభ్రమరాంబా

సమేత శ్రీ మల్లికార్జునస్వామి-చరరూపమున-అంతర్బహిస్సులందు పదేపదే ప్రేరేపించుటచే-ఆశక్తుడనైనను మానసిక శక్తిని శివానుగ్రహమువలన ఇనుమడింపజేసికొని-ఈ పరిష్కారమును వ్రాయుట-అనివార్యమైనది. "జ్ఞానలవదుర్విదగ్ధం-బ్రహ్మాఽపి నరం న రంజయతి" అన్నట్లు,అల్పజ్ఞానులై అర్జునునివలె - ప్రజ్ఞావాదముల నొనర్చు స్వల్పపండితులకే గాక-బాదరాయణాదుల సంధుల నొనర్చి-బాదరాయణ సూత్ర విరుద్ధముగా ద్వైతాద్వైత వాదమును పురస్కరించుకొని-రెండుమూడు ఉపనిషత్తులలో పునరుక్తులతో అకాండతాండవము నొనర్చిన అభినవబాదరాయణులకును సంతృప్తి కలుగవలెనని వ్రాసితిని. ఇద్ది—గుణగ్రహణపారీణులకు స్వీకార్యము రంధ్రాన్వేషణతత్పరులకు అగ్రాహ్యమునై సామాన్య శైవ వర్గమునకు ఆచరణీయమై ముందుతరముల వారికి ఆధారమగుగాక !

శ్లో॥ ఆరాధ్య శైవ వర్గస్య-సందేహవినివృత్తయే ।
పరిష్కారం లిఖామీమం-శివోఽతః సంప్రసీదతు ॥

,, నిర్మలః శంకరోఽహం శ్రీ-గోత్ర గౌతమ సంభవః ।
భాష్యాంధ్రార్థపరిపక్వాచ-శ్రుతిస్మృత్యాగమాదితః ॥

,, ప్రతివాదీ ప్రసన్నః స్యా—దేతత్పఠనతః సుధీః ।
స్వస్యాగ్రహం పరిత్యజ్య-విందతాం శుభ మన్వహమ్ ॥

నిర్మల శంకరశాస్త్రి

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ షడక్షరి (పంచాక్షరి) మహామంత్ర ప్రాశస్త్యము

శ్రీ శివమహా పురాణే వాయవీయసంహితాయామ్-

శ్లో॥ వేదే శివాగమే చాయ-ముభయత్ర షడక్షరః ।
మంత్రః స్థితః సదా ముఖ్యో-లోకే పంచాక్షరః స్మృతః॥

,, సర్వమంత్రాధిక శ్చాయ-మోంకారాద్యః షడక్షరః ।
సర్వేషాం శివభక్తానా-మశేషార్థప్రసాధకః ॥

,, మంత్రం సుఖముఖోచ్చార్య-మశేషార్థప్రసిద్ధయే ।
ప్రాహోంనమఃశివాయేతి-సర్వజ్ఞః సర్వదేహినామ్ ॥

ఈ షడక్షర మంత్రము వేదమున శివాగమమునందును ముఖ్యముగా చెప్పఁబడినది. లోకమున పంచాక్షరమని ఇదియే వ్యవహరింపఁబడును. ఓంకారము ఆదియందు గల షడక్షర మంత్రము-సర్వమంత్రములకన్న శ్రేష్ఠమై శివభక్తులందరికిని ప్రయోజనముల నన్నిటిని సాధింపఁజేయునది. మరియు ఐహిక ఆముష్మిక సత్కార్యములు సిద్ధించుటకై-సుఖముగ నోటఁబలుకఁదగినదియు నగును. సర్వజ్ఞుఁడైన

శివుఁడు మానవులనందరి నను గ్రహించుటకై - "ఓం నమః శివాయ" అని స్వయముగ నుపదేశించినవాడు.

ప్రశ్న : అయ్యా! ఈ మంత్రము శివాగమములయందు పురాణములయందు చెప్పఁబడుటచే నిది వైదికము కాదని తోచెడిని.

ఉత్తరము: "తన్నమ ఇత్యుపాసీత" అను శ్రుతివాక్యము- తత్ = శివ శబ్దితమైన బ్రహ్మమును; నమఇతి = నమఃశబ్ద పూర్వకముగా; ఉపాసీత = ఉపాసింపవలెను" అని పంచాక్షర మంత్రము వైదికమని చెప్పుటయేగాక - "ఓమితిహ్యగ్రే వ్యాహరేత్ । నమఇతి పశ్చాత్ । తతః శివాయేత్యక్షర త్రయమ్" "ఓమ్" అను దానిని ముందు ఉచ్చరింపవలెను. అటుపిమ్మట "నమః" అనుదానిని "శివాయ" అనుదానిని దాని తరువాత పలికిచో-శివషడక్షరీ మంత్రమగునని - జాబాలోపనిషత్తు నిర్వచించుటఁజేసి-ఇయ్యది-వైదికమూర్ధన్య మని తేటపడుచున్నది. మరియు శివమంత్రమును జపింపని యెడల ప్రత్యవాయము ఏర్పడునని - అధర్వణ సంహిత యందలి ఏకాదశకాండములో ప్రథమానువాకమున ఏకత్రింశన్మంత్రాత్మకమగు రుద్ర సంహితలో పదునేడవ మంత్రము నిర్వచించినది. యజ్ఞాంతమున చేయఁబడు స్విష్టకృత్ హవనము-శివపరమగుటచే శివనామఘటిత మగు నీ మంత్రము- కర్మసంసిద్ధికారి యని తెలియవలెను. అక్షమాలికోపనిషత్తు- ఈ మంత్రము-మంగళ కరమైనదని నిరూపించినది.

ప్రశ్న : కలిసంతరణోపనిషత్తున రామమంత్రము తారకమని ప్రతిపాదింపబడినందున— శివవిష్ణుమంత్రముల లోని అక్షరములు రెండుకూడి-రామ శబ్దముగ—ఏర్పడినందు నను శివమంత్రము తారకము కాదని అంగీకరింతురా ?

ఉత్తరము: శివమంత్రము తారకము కాదని తేలినచో మీరు చెప్పినది- అంగీకార్యమగును గదా! జాబాలోపనిషత్తున "అథహైనం బ్రహ్మచారిణ ఊచుః కింజప్యేనామృతత్వం నో బ్రూహీతి, సహోవాచ యాజ్ఞవల్క్యః — శతరుద్రీయేణేతి, ఏతాని హవా అమృతస్య నామధేయాని, ఏతైర్హవా అమృతో భవతీతి"

"బ్రహ్మచారులు- దేనిని జపించినచో మోక్షము చేకూరు నని ప్రశ్నింపగా-యాజ్ఞవల్క్యుడు శతరుద్రీయ జపముతో ముక్తి లభించును. శతరుద్రీయగత శివనామములు అమృతు (జరామరణరహితుఁడగు పరమేశ్వరు)నివేను. వీనిని జపించు వాడు ముక్తుఁడగును" అనుచో- శివనామస్మరణము ముక్తి ప్రదమని- ప్రతిపాదింపఁబడెనది. మరియు "తత్తారమితి" అధర్వశిఖాదులు; "నమస్తారాయ" అని రుద్రాధ్యాయము, "శైవషడక్షరి-తారక"మని బృహజ్జాబాలము నిర్వచించుటచే నీ మహామంత్రమే సంసారార్ణవ తారకమగునని విదితమైనది.

"వ్రతమేతచ్ఛాంభవం, తత్సమాచరేత్ - ముముక్షుర పునర్భవాయ" శ్రుతి "మోక్షాపేక్షగలవాడు-జన్మరాహిత్యము నకై శాంభవవ్రతమును స్వీకరించి ఆచరింపవలెను."

శాంభవవ్రతము - వేదామన్త్రక్రియాత్మకమైనందున — లింగ ధారణము మహామంత్రస్వీకారము ఇత్యాదులతో ఆచరణీయ మగుటచే శ్రౌతశైవుల (స్త్రీలకు పురుషులకు భస్మధారణముతో ప్రారంభమగు శివదీక్షలో లింగధారణమువలె-ప్రణవషడక్షరీ మహా మంత్రము ముఖ్యమైనది.

ప్రశ్న: "స్త్రీ శూద్ర ద్విజబంధూనాం—త్రయీ న శ్రుతి గోచరా" అని యుండుటచే — చంద్రజ్ఞానము స్త్రీలకు ప్రణవమును నిషేధించుటచేతను స్త్రీలకు ప్రణవరహిత పంచాక్షరి నుపదేశింపవలెనని తెలియుచున్నది గదా!

ఉత్తరము-స్త్రీలకు ప్రణవమును చంద్రజ్ఞానము నిషేధించినను కారణోత్తరాదులు-వికల్పమును చెప్పుటచే-ద్విజ స్త్రీలకు ప్రణవాధికారము కలదని తేటపడును. భస్మరుద్రాక్ష జాబాలోపనిషదాదులు గూడ స్త్రీలకు ప్రణవాధికారమును నిషేధింపలేదు.

శ్లో॥ శివో వా ప్రణవో హ్యేషః—ప్రణవో వా శివస్తథా ।
వాచ్యవాచకయోర్భేదో-నాత్యంతం విద్యతే క్వచిత్ ॥
శివమహాపురాణము.

"శివుడే ప్రణవము, ప్రణవమే శివుడు; వాచ్యవాచకములగు శివప్రణవములకు అత్యంతభేదము లేదు"

ఓంకారము అథశబ్దము-సృష్ట్యారంభమున-బ్రహ్మదేవుని కంఠమును పెకిలించి బయలుపడినవగుటచే-ఓంకారాథ శబ్దములు-మాంగళికములగుచున్నవి. స్త్రీలకు వివాహానంతరము ద్విజత్వమే గాక మాంగళికత్వము గూడ సంఘటితమగును. "సుమంగళి" అను నామధేయము వివాహిత స్త్రీలకు చెల్లు

చున్నది. సుమంగళికి-మంగళార్థము గల ప్రణవమును నిషే ధించుటవలన సుమంళినమంగళిగా నొనర్చినవారమగుదుము.

"యత్ర నార్యస్తు పూజ్యంతే-రమంతే తత్ర దేవతాః"
"కలకంఠి కన్నీరు లొలికిన – సిరి యింట నుండనొల్లదు"
ఇత్యాదిసూక్తులు – ఆడువారి నవమానింపరాదని తెలుపు చున్నవి. ద్విజస్త్రీలను శూద్రురాంద్రనొనర్చుట–తిరస్కార మగును. అందువలన పురుషులకు అనర్థము వాటిల్లును. లలితా సహస్రనామాదులలో "ఐం హ్రీం శ్రీం" అని మాత్రము ఉచ్చరించి ప్రణవాత్మకుఁడగు శివుని విసర్జించినచో దక్ష ప్రజాపతివలె శిక్షార్హులగుదురు. స్త్రీలకు కేవలము ప్రణవో వదేశమును నిషేధించుటయందు తాత్పర్యము గలవి-ప్రణవ నిషేధవాక్యములని అంగీకరించినచో-ఇతర ప్రమాణబాహుళ్య మునకు విరోధము సంభవింపదు.

ప్రశ్న : ఓహో! మీరు అభినవ పరాశరులా? స్త్రీ ప్రణ వాధికార నిషేధము కలియుగమున లేదని నిరూపించుచు శైవస్త్రీలకు అనర్థము వాటిల్లునట్లు-శైవమతమును దిగఁ జార్చుచున్నారని తోచెడిని.

ఉత్తరము-మహోపాధ్యాయ, శ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రిగారే-అభినవభారద్వాజుఁడు,అభినవ ఉద్భటారాధ్యుఁడు, అభినవ నీలకంఠాచార్యుఁడు ఇత్యాది బిరుదముల సంటి పెట్టుకొననప్పుడు–నేను అభినవ పరాశరాది బిరుదములకు అర్హుఁడనగుదునా ?

"కలౌ పారాశరస్మృతిః" పరాశర స్మృతియందు-కలి యుగమున-సన్న్యాస పలపైతృకాదుల నిషేధముతోసహ"పతి రన్యోవిధీయతే"స్త్రీలకు స్థాలీపాకమునకు ముందుపూర్వ నిశ్చిత పతి అసమర్థుఁడని తెలిసినచో నాతినిని దూరమొనర్చి రెండవ వానితో వివాహవిధిని జరిపింపవలెనని వ్రాయఁబడుటచేతను, ఉపనిషత్తులు కారణోత్తరాది శివాగమములు స్త్రీ ప్రణవాధి కార నిషేధమును విశదపరుపకుండుటను, "గ్రంథాదిని మంగళాచరణము శిష్టాచారమై అనుమేయ శ్రుతిప్రమాణక మగునని ముక్తావళిలో నిర్ణయించినట్లు" ద్విజస్త్రీలకు ప్రణ వాధికారము గలదనుటకు అనుమేయ శ్రుతికలదని-అభినవు లందరు అంగీకరింపవలెను. శైవులలో కొందరు అభినవ బాదరాయణులు కాగా-మఱికొందరు — అభినవబోధాయనులై నూతనప్రమాణములను కల్పించుచు శైవలోకమును సందే హార్ణవ నిమగ్నమొనర్చుచుండుట-శోచనీయము.

ఒకరు—ఆచారలింగేత్యాదుల బదులు ప్రాణాయస్వాహా దులు వ్రాయుటయు మరియొకరు - సద్యోజాతాది పంచముఖ ములయందు జన్మించినవారు-ఋషులని వ్రాయుటయు శైవ సంప్రదాయ విరుద్ధములగుచున్నవి. వచ్చిరాని సంస్కృత భాషతో, అలవడని కర్ణాటకభాషా పరిచయముతో, ఎవరికిని అందవను భావనవలన అపరిచిత అప్రసిద్ధ ప్రమాణముల నుదాహరించుటతోడను అభినవ బోధాయనులగుట-విచార ణీయమగుచున్నయది.

ప్రశ్న : ఎందుకండీ ఈ ఆర్భాటము ; వేదాధికారము లేనివారికి-ప్రణవాధికారము గూడ నుండదని భావింపవలెనని తెలియదా మీకు ?

ఉత్తరము : కారణోత్తరమున అష్టమపటలమునందు-

శ్లో॥ విద్యాసు శ్రుతి రుత్కృష్టా-రుద్రైకాదశినీ శ్రుతౌ ।
తత్ర పంచాక్షర స్తత్ర-శివ ఇత్యక్షరద్వయమ్ ॥ 4

తస్మా దధికృతాం వేదే-తతాఽనధికృతా మపి
మదీయ మూలమంత్రేణ-పూజనం సర్వతో వరమ్॥ 5

అష్టాదశవిద్యలలో శ్రేష్ఠమగు వేదమునందలి రుద్రాధ్యాయమునందు పంచాక్షరీ మంత్రము, అందు "శివ"అను అక్షర ద్వయము ముఖ్యమగును. వేదాధికారము గలవారు, లేని వారును మూలమగు ప్రణవముతో గూడిన శివషడక్షరీ మహా మంత్రముతో శివుని పూజించుట-శ్రేయస్కర మగునని వ్రాయఁబడినది. మరియు నదే కారణోత్తరమున-ద్వితీయ పటలమునందు

శ్లో॥ వైదికం తాంత్రికం చేతి-వ్రత మేత ద్ద్విధా భవేత్ ।
ద్విజానాం వైదికం ప్రోక్త-మన్యేషాం తాంత్రికం
స్మృతమ్ ॥ 38

ఈ శాంభవవ్రతము-వైదికమనియు-తాంత్రికమనియు-రెండువిధములుకాగా - "జన్మనా జాయతే శూద్రః-కర్మణా జాయతే ద్విజః" అన్నట్లు-ఉపనయనవివాహములతో ద్విజు

లగువారికి వైదికముగాను, అన్యులకు తాంత్రికముగాను చెప్పఁబడినది. వివాహముతో స్త్రీలు ద్విజులు కానిచో వారికి శాంభవదీక్ష నొసగువిధానము - వైదికమంత్రరహితముగా తంత్రశ్లోకములలో ఎచటగలదో స్త్రీ ప్రణవ నిషేధవాదులు ప్రదర్శింపవలెను. లేదా నూతనముగ కల్పించి అభినవ పరాశరులు కావలెను. ఈ శ్లోకమున - అన్యాసాం-అని స్త్రీ లింగముండినచో ప్రతివాదుల అభీష్టము నెరవేరెడిది.

శ్లో॥ వ్రత మావశ్యక మిదం- కథ్యతే యోషితా మపి ।
అనుష్ఠేయం పరస్తాద్వై-నియతం పాణిపీడనాత్ ॥ 56

ద్విజ స్త్రీలకు—వివాహానంతర మీ వ్రతము అవశ్యకమై అనుష్ఠింపదగినదనుటలో ద్విజస్త్రీలకు వివాహానంతరము ద్విజత్వము ఏర్పడుననుట- ఇమిడియున్నది. ప్రణవమునకు బదులు "హ్రీం" చేర్చవలెననియు "హ్రీం" అనునది వైదిక మనుటకు"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"అను పురుష సూక్త వాక్యమును ప్రమాణముగా చూపిన వారిని పండితులన వలెనా? మహాపండితులనవలెనా?

"హ్రీః" "లక్ష్మీః" అని పదవిభాగము కాగా "హ్రీం" అని నిరూపించుట-పామరులను వంచించుటకే నని తోచెడిని. "హ్రీం" అనుదానిలో పంచవిభాగములు లేనందున సూక్ష్మ పంచాక్షరి యనఁదగదు. పైగా హకారముగల హ్రీంబీజము-సౌమ్యాతిసౌమ్యమైన శివపంచాక్షరీ మంత్రమునకు జతపఱచుటలో స్వారస్యము లేదు.

అవతిధాతునిష్పన్నమైన "ఓం" అనునది–అకార ఉకార మకారబిందునాదాత్మక పంచవిభాగములు గలదై-"జ్ఞాపకుని రక్షించు" నను అర్థము గలిగియున్నది. రక్షకుడైన శివునకు నమస్కారము అను నర్థము–"హ్రీంనమఃశివాయ" అనుటలో "రక్షకుఁడుకాని శివునకు నమస్కారము" అను పెడర్థముండు టచే ఆడవారందరిని రక్షించునది కాదని తోచెడిని. తాంత్రిక బీజములకు శబ్దశక్తిమాత్రముండును గాని అర్థశక్తియుండదు గాన-ఉచ్చారణతోనే తాంత్రికబీజములు సిద్ధించునవి. ప్రణవము అట్లుగాక శబ్దార్థశక్తులతో–ఉగ్రమైన భైరవయాతన, జననమరణాది సంసారబంధము రాకుండా – జ్ఞాపకులను కాపాడునది కావుననే ప్రణవమా! మమ్మురక్షింపుమని తైత్తిరీయము ప్రార్థించినది.

కారణోత్తరమున ద్వితీయపటలమునందు–

శ్లో॥ దీక్షేహ్యుభే వికల్పేన-యుజ్యేతే ద్విజయోషితాం।
తాంత్రిక్యామధికారః స్యా-ద్ధర్తుం స్త్రీణాం స్వతంత్రతః॥
పుమాంస మగ్రితః కృత్వా-వైదిక్యాం పరతంత్రితః॥
57

తాంత్రికమనియు వైదికమనియు శాంభవదీక్ష–రెండు విధములై ద్విజస్త్రీలకు వికల్పముగా ఉపయుక్తమగుచున్నది. ఎట్లనఁగా? స్త్రీలు–స్వతంత్రముగా తాంత్రికదీక్షఁ బరిగ్రహింపవలెను-పురుషునితో సహ తీసికొనునెడ-వైదికదీక్ష

యవసరము. ఇట-ద్విజస్త్రీలకు దీక్షావికల్పము స్వతంత్ర పరతంత్రభేదమును పురస్కరించుకొని చెప్పఁబడుట-పరమ ఛాందసుల నోదార్చుటకని తోచెడిని. వివాహానంతరము ద్విజ స్త్రీలు పురుషునితో సహ దీక్షఁబరిగ్రహించుటలో ద్విజస్త్రీలకు వైదికదీక్షయందు ముఖ్యమగు ప్రణవపంచాక్షరిని స్వీకరించుట విహితమను నర్థము ఇమిడియున్నది.

"ఉదితే జుహోతి, అనుదితే జుహోతి" అను వికల్పము విహితమైనట్లు "ఏకో దేవః కేశవో వా శివో వా" అను వికల్పము అవిహితమగుటయే గాక శైవ శాక్తేయ వైష్ణవాదులచే నపరి గ్రాహ్యమగుచున్నయది. ఇట్లే కొన్ని వికల్పములు శాస్త్రము నందు చూపఁబడినను "శాస్త్రాత్ రూఢి ర్బలీయసీ" అన్నట్లు దేశకాలపాత్రోచితమైన లోకరూఢి ననుసరించి-వికల్పమును పరిష్కరింపవలసియుండును.

ప్రశ్న: అయ్యా! మీ సమర్థనము చాలావరకు సమంజసమై సంఘమును సమీకరించునదిగా తోచెడిని. ఐనను చంద్రజ్ఞానము స్త్రీ ప్రణవాధికారమును నిషేధించినను-స్త్రీలు ప్రణవ పంచాక్షరిని జపించవచ్చునని-అంతరాత్మలో ఇష్టపడిగూడా మా మాట నిలువవలెనని, ఇందుమూలమున పేరు ప్రఖ్యాతులు పెంపొంది ప్రజలు మాకు గండపెండేరము తొడిగి సత్కరింతురని-చంద్రజ్ఞానవాదులము ఆశిస్తున్నాము గాన "హ్రీంకారవదనా దేవీ" "శికారవదనా దేవీ" అనుట-విహితమే గదా!

ఉత్తరము- ఘట్టకుటీ న్యాయమున మీరు చంద్రజ్ఞాన మునే ఆశ్రయిస్తున్నారు. సుంకము తప్పవలెనని ప్రక్కదారిని నడిపించిన బండివాడు—సుంకము తీసికొను గుడిసెముందుకే వచ్చినట్లు మీ పరిస్థితి ఏర్పడినది. "భూయసాం స్యాత్స్వధర్మ త్వం" అను న్యాయమున బహుశ్రప్రమాణములు చెప్పినది అంగీకార్యమగును.

వైదికమూర్ధన్యమగు శివపంచాక్షరికి హ్రీం ముఖమనియు లేక శికారము ముఖమనియు చెప్పినచో-వాచకము దేవీరూపము వాచ్యము శివరూపము నను విభాగమున వాచ్యమగు శివ రూపమునకు "హ్రీం" అను శక్తి-ముఖమగుటయు అసంగత మగుచున్నది. "శికార వదనా" అను పాఠములో షడంగ న్యాసము సంఘటితముకాదు. "పైగా విసర్గలు" ఒక అక్షరము కానందున-ఆ పాఠము ముఖ్యము కాదని తెలియుచున్నది.

చంద్రజ్ఞానము పూర్వపక్షము చేయగా కారణోత్తరము సమాధానముఁ జెప్పినదని మీరంగీకరింతురా?

ఇఁక భస్మజాబాలోపనిషత్తున ద్వితీయాధ్యాయమునందు "ఓ మిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, తతః శివాయే త్యక్షరత్రయం, నాతస్తారకః పరమో మంత్రః, తారకోఽయ ముపదిశ్యతే, అవిముక్తే శైవేభ్యో జీవేభ్యః, శైవోఽయమేవ మంత్రస్తారయతి, స ఏవ బ్రహ్మోపదేశః" ఓం అని ముందు ఉచ్చరింపవలెను. తరువాత "నమః" అనియు పిమ్మట "శివాయ"అని పలుకవలెను. దీనినిమించిన తారకమంత్రము

మరియొకటి లేదు. ఈ శివషడక్షరి యను తారకమంత్రమే కాశీక్షేత్రమునందు శివభక్తులైన ప్రాణులకు విశ్వేశ్వరునిచే ఉపదేశింపఁబడుచున్నది. ఈ శివమంత్రమే సంసారసాగరము నుండి భక్తులను తరింపఁజేయునది. ఇదియే బ్రహ్మోపదేశ మగును.

ఇచట మన ప్రతివాదులు—స్త్రీలకు ప్రణవాధికారము లేదని చూపుటకు "హ్రీ మిత్యగ్రే వ్యాహరేత్" అను పాఠము కల్పింతురేమో;

శివగీతాయాం షోడశాధ్యాయే-శ్రీ భగవానువాచ-

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశః శూద్రా-స్త్రియశ్చాత్రాధికారిణః।
బ్రహ్మచారీ గృహస్థోవా-ఽనుపనీతోఽథవా ద్విజః ॥ 2
వనస్థోవా ఽవనస్థోవా-యతిః పాశుపతవ్రతీ।
బహునాఽత్ర కిముక్తేన-యస్యభక్తిః శివార్చనే॥

స ఏవాత్రాధికారీ స్యాత్-నాన్యచిత్తః కథంచన॥

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, అనాచారులు బ్రహ్మవిద్యఁగూర్చి ఆవేదనతో ఆచార్యు నాశ్రయించువారు (ఇటశూద్రశబ్దముచే చెప్పఁబడుదురు) ద్విజస్త్రీలు, బ్రహ్మచారి, గృహస్థుఁడు, పత్నీరహితుఁడు (అవనస్థుఁడు) వానప్రస్థుఁడు, సన్న్యాసి, పాశుపత వ్రతస్థుఁడు ననువారు-శివారాధనముతో కూడిన శివమంత్రానుసంధానము అను బ్రహ్మవిద్యయందు

అధికారము కలిగియుందురు అని పరమేశ్వరుఁడు-శ్రీరామ చంద్రునకు చెప్పెనని కలదు.

ఇఁట పాశుపతవ్రతములో షడక్షరీజపము ముఖ్యమనియు ద్విజస్త్రీలు ధర్మార్థకామములయందుగాక-మోక్షమునందు స్వతంత్రమైన అధికారము కలిగి యుందురనియు ప్రతివాదులు అంగీకరింతురా? శివభాషితమును త్రోసిపుచ్చుదురా? పంచబ్రహ్మోపనిషత్తున-పంచాక్షరమయం శంభుం పరబ్రహ్మస్వరూపిణం, నకారాది యకారాంతం- జ్ఞాత్వా పంచాక్షరం జపేత్-అనుచో "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" అను వాక్యము ననుసరించి-బ్రహ్మమనఁదగు ఓంకార స్వరూపుడు పంచాక్షరాత్మకుఁడు నగు శివుని పంచాక్షరమయునిగా ధ్యానించి నకారాదియకారాంతమగు పంచాక్షరీమహామంత్రమును జపింపఁవలెనని కలదు, ఇఁట-నకారాది అని యున్నది గాని శికారాది అని లేదుగదా? అట్టితఱి ప్రతివాదులు "శికారవదనాదేవీ" అను పాఠము నెట్లు సమర్థింతురో;

నొసటఁ దాల్చిన భస్మరేఖలు మూడు-అకార ఉకార మకారాత్మకములని ప్రణవావయవములను జాబాల్యుపనిషత్తు ప్రతిపాదించుటచే-స్త్రీలు భస్మత్రిపుండ్రములను ధరింపఁ గూడదనినచో "స్త్రీభి స్త్రిపుండ్రమలకావధి ధారణీయం" ఇత్యాది ప్రమాణములు వ్యర్థములగును. బ్రహ్మోత్తరఖండమున-ప్రథమాధ్యాయమునందు-

శ్లో॥ శైవం షడక్షరం దివ్యం-మంత్ర మాహు ర్మహర్షయః ।
మంత్రాణాం పరమో మంత్ర-స్తథా సోఽయం షడక్షరః॥

ఓం నమః శివాయేతి-మంత్ర మాహ శివః స్వయం ।
స్త్రీభిః శూద్రై శ్చ సంకీర్ణై-ర్ధార్యతే ముక్తికాంక్షిభిః ॥

దివ్యమైన షడక్షరీమంత్రమును మహర్షులు నిరూపించుటయే గాక-మంత్రములలో శ్రేష్ఠమైన "ఓం నమః శివాయ" అను మహామంత్రమును శివుఁడు స్వయముగ చెప్పెను. దీనిని స్త్రీలు, జననమరణబంధవేదనతో ఆచార్యునాశ్రయించు వారు. సంకీర్ణులు-స్వీకరించియున్నవారు.

"స్త్రీ శూద్రద్విజబంధూనాం-త్రయీ న శ్రుతి గోచరా" ఇత్యాది [illegible]-శాంభవదీక్షా రహితస్త్రీలకు ద్విజేతరులకు [illegible] వేదశ్రవణమును నిషేధించినవని [illegible] స్పష్టము చేయుచున్నది.

బ్రాహ్మణాచారములను పరిహరించి కులభ్రష్టులై సంధ్యావందనాది నిత్యకర్మలను విసర్జించి సురాపానాదులతో స్వేచ్ఛగా విహరించువారు ద్విజబంధువులనబడుదురు. దృష్టలింగమును చేతిలో ఉంచి మజ్జనమునైన ఆచరింపక ఇష్టలింగము పోయినచో మరియొక లింగము సవిధిగ ధరించి ఎవరికిని చెప్పనివాడు, పాశ్చాత్యవ్యామోహముచే వర్ణభ్రష్టులై బాబాల నాశ్రయించి-ఇష్టలింగమును తీసివేసి-నలుగురిలో మెడలో లింగకాయను వేసికొనువారు, సదాచారమును

మరియు శివపూజన శివమంత్రజప శివధ్యానములంజేయు వృద్ధ మాహేశ్వరుల నెదుర్కొనుచు వారి ప్రారబ్ధానుభవమును తమ ప్రతివాదనిరాకరణప్రత్యక్షముగా చూపెట్టు అల్పజ్ఞానులు, కేశకవచాదిధారణముతో సంచరించువారు, మాహేశ్వరులను రంధ్రాన్వేషణతో దూషించువారును విషయనిర్ణయమునకు అనర్హులగుదురు.

ఇట్టివారికందరికి చంద్రజ్ఞానవాదులు-ప్రణవపంచాక్షర్యుపదేశము నుపేక్షించుట శివమహాపచారమగును.

పూర్వము సానందుండు—నరకవాసులకు శైవషడక్షరిని వినుపించి ముక్తులంజేసిన ఉదంతము ప్రతివాదులకు ప్రతికూలమగును. ఎందుకనంగా? నరకవాసులలో స్త్రీలుగూడా ఉందురు గాన ప్రణవనిషేధమును సానందుండు పాటింపకుండుట-ప్రతివాదుల ఆవేదన హేతువగుచున్నది. శివమహాపురాణమున వాయవీయసంహితలో "తప్తచామీకరప్రఖ్యా" ఇత్యాదివర్ణనమున ఓంకారాది వర్ణషట్కమునకు వర్ణరూపాదులు వ్రాయంబడి హ్రీంకారాది వర్ణములకు వర్ణరూపాదులు వ్రాయబడకుండుట విచారణీయమగుచున్నయది.

"నమఃశివాగ్ని బీజాయ" ఇత్యాదిశ్లోకమున "హర"అనుదానిలో గల రకారమును మంగళప్రదముగా నొనర్చు, లేక—అగ్నిబీజముగల హరశబ్దముచే చెప్పంబడు శివునకు నమస్కారము.

2)

"శివం అగ్నిబీజం యస్మా త్తస్మై" "అగ్నిబీజమిశ్రిత హరశబ్దవాచ్యాయ శివాయ"అని నిర్వచనము, ఇఁక "ఓమంత మంత్రరూపాయ" (ఇఁట అంతశబ్దము సమీపార్థకమని శ్రీ నాగలింగ వీరేశలింగశాస్త్ర్యాది నిర్వచనము) ఓం అంతే సమీపే యస్య- తాదృశమంత్రః రూపం యస్య తస్మై" "మూలపంచాక్షరాత్మనే" స్థూలపంచాక్షరస్య మూలం సూక్ష్మ పంచాక్షరాత్మకప్రణవః, తదాత్మనే హరాయ" అను నిర్వాచన ములు శ్రుతములైనవి. ఏవంసతి-ప్రణవషడక్షరియే ముఖ్య ముగ జపింపఁదగినదని-ఈ ధ్యానశ్లోకముచే తేటపడినది.

పంచాక్షరీమంత్రమునకు ఋషిఛందోదేవతాబీజకీలకము లను నిర్వచించుతఱి "ఓం" బీజమనియు, "నమః" శక్తి యనియు "శివాయ" కీలకమనియు కలదు గాన- "హ్రీం" బీజం అని లేదు గానను "శికారవదనా" అను పాఠమున "శి" కారమును బీజముగా నొనర్చినచో "వాయ" అను దానిని కీలకముగా చెప్పనెడల-బీజాదులు అనర్థకములగుచున్నవి. శ్రీ ప్రణవనిషేధవాదులు-ఎన్నిటినో తారుమారుచేసి-చంద్ర జ్ఞానములో కొన్ని శ్లోకములను ప్రక్షిప్తములఁ జేర్చియుం యుందురు గాబోలు;

మూకులు జడులు ఉన్మత్తులు శివభక్తిరహితులు మాహే శ్వర ద్వేషులు నాస్తికులును శివమంత్రజప శివారాధన శివ ధ్యానములకు అనర్హులని శివగీతా నిర్వచనము. "ఉమా" అను పేరులో వ్యత్యాసముగా "అ" చివరన "మ్" మధ్యన "ఉ"

మొదట నున్నందున ప్రణవమగునని "త్వదీయం ప్రణవం విద్ధి" అని పరమేశ్వరుఁడు పార్వతీదేవికి చెప్పినను "ఉమా" నమఃశివాయ" అని స్త్రీలు జపించవలసినదిగా నిర్దేశింపలేదు.

అంగుష్ఠతర్జనీమూలములు వరుణ అసీ నదులనియు, వామకరతలము కాశీక్షేత్రమనియు, ఇష్టలింగము విశ్వేశ్వరుఁడనియు ఇష్టలింగాభిషేక జలము గంగోదకమనియు చెప్పినందుకు-శ్రౌతశైవులకు-స్త్రీపురుష వివక్షలేకుండా-అంత్యకాలమున సాక్షాత్కరించి ప్రణవపంచాక్షర్యుపదేశము నొనర్తునని శివుఁడు వక్కాణించినట్లు నిరూపించు మకుటోత్తరము ప్రమాణము కాదందురా?

వైదికమగు సమాధిసంస్కారముచే-స్త్రీలకు మహేశ్వర సదాశివ శివరూపములు వచ్చుటను నాలుగవ ఆమె-చతుర్థ నివృత్తితో శివసాయుజ్యముఁజెందుటను ప్రణవనిషేధవాదు లంగీకరించినచో స్త్రీకి పురుషత్వము వచ్చుటమూలముగా ప్రణవవేదాధికారము ఆవహించుటయను అనభీష్టము తార సిల్లును. తథాసతి "మురారే స్తృతీయః పంథాః" అను పిడివాదమునే ప్రియముగా నొనర్చువారు విచారణీయులగుదురు.

స్త్రీ పురుషభావము శరీరమునకే గాని ఆత్మకు లేదనియు, భార్యాభర్తృత్వాదులు సాంప్రతికములు మాత్రమనియు, సంస్కారము శరీరయుక్తుఁడగు జీవాత్మకు చేయఁబడుననియు, కేవలము శరీరమునకు కాదనియు మరియొక నిర్వచనము. ద్విజస్త్రీలకు ప్రణవమును శ్రుతి నిషేధింపక

పోగా "యస్యైతే చత్వారింశ త్సంస్కారాః, స బ్రహ్మణః సాయుజ్య మాప్నోతి" "ఏ జీవాత్మకు గర్భాధానాది చత్వారింశత్ (40) సంస్కారములు చేయఁబడునో-అట్టివాడు శివసాయుజ్యము నొందు నను గౌతమస్మృత్యాదులు-స్త్రీ ప్రణవాధికారమును నిషేధింపలేదని విదితమగుచున్నది. ఎట్లనఁగా? గర్భాధానము పురుషునిచే స్త్రీకి చేయఁబడును. గర్భాదానాది సంస్కారములు-స్త్రీ సంబంధము కలవని-వైదికములు కావనునెడ-ద్విజులందరి నవైదికులుగా మార్పఁగలుఁగుదురా ప్రతివాదులు? తథాసతి వేదవేదాంతములు వైదికమంత్రములు ననవకాశములగుటయే గాక- కారణోత్తరాగమాదులు నిరుపయోగములగుచున్నవి. అబ్బా! ఇంతటి అనర్థము నొడిఁగట్టుకొని-ప్రతివాదులు ప్రకాశింతురా? వీరినా శివుఁడే ఉద్ధరింపవలెను.

స్త్రీ మరణించినచో సమాధిపై లింగమును స్థాపించి పూజించుటకు, ఏకాదశాహ ద్వాదశాహకృత్యముల నొనర్చుటకును, వైదికమంత్రములకు బదులు పౌరాణికమంత్రములను కల్పించి ఉచ్చరింపఁజేసినచో కర్త-జందెమును తీసివేసి-కేవలము లింగధారణతో జంగముఁడై కర్మ నొనర్పవలసివచ్చును. అట్టితటి-బ్రాహ్మణ్యమే దెబ్బతినును. "మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" అన్నట్లు ప్రతివాదుల పాండిత్యాతిశయము-మూలచ్ఛేదక మగును.

వైదికదీక్షను పురుషునకునిడి-స్త్రీకి అవైదికదీక్ష నొసఁగు

నెడ ఆమెకు వేదమూలమగు ప్రణవస్వీకారాధికారము రాదు గదా! అట్టితటి అవైదికురాలు పాకాదిపరిచర్యఁజేయు నర్హురాలు గాకుండును. పైగా

శ్లో॥ అదీక్షాసంస్కృతా నారీ-దీక్షితస్య నిజేశితుః ।
న యోగ్యా పరిచర్యాయై-దీక్షణీయా సతీ తతః ॥ 73
కారణోత్తరము ద్వితీయపటలము

"శాంభవదీక్షితుఁడైన పతికి-దీక్షాసంస్కారము లేని సతి-పరిచర్యకు యోగ్యురాలు కానందున-భర్తతోపాటు భార్యకు దీక్షనొసఁగవలెను"

ఇఁట వివాహముతో ద్విజత్వము బ్రాహ్మణస్త్రీలకు సంభవించును గాన ద్విజస్త్రీలకు పంచాక్షరీ ప్రారంభమగు ప్రణవము (సూక్ష్మపంచాక్షరి) నుపదేశించుట శాస్త్రీయమే గాక-దేశకాలపాత్రోచితపరివర్తనముతో-లౌకికంబు నగును.

## శివపురాణే వాయవీయసంహితాయాం-ఉత్తరభాగే త్రయోదశాధ్యాయే

శ్లో॥ మయైవమసకృద్దేవి-ప్రతిజ్ఞాతం ధరాతలే ।
పతితోఽపి విముచ్యేత-విద్యయానయాఽనఘే ॥ 7
కిమత్ర బహునోక్తేన-భక్తాః సర్వేఽధికారిణః ।
మమ పంచాక్షరీ మంత్రే-తస్మాచ్ఛ్రేష్ఠతరో హి నః॥20

"దేవీ! ప్రపంచమున నేను "ఈషడక్షరీ విద్యతో పతితు

దైనను ముక్తుండగు" నని అనేక పర్యాయములు ప్రతిజ్ఞ జేసితిని. పెక్కు చెప్పనేల? నాయందు భక్తిగలవారందరు (స్త్రీలు పురుషులు) ఈ షడక్షరీ విద్యయందు అధికారము కలవారగుటచే ఈ మహామంత్రము విధినిషేధములకు అతీతమై శ్రేష్ఠతరంబగుచున్నయది అని శివుఁడు ఆదేశించెను.

ఇట పతితుఁడనఁగా-ద్విజబంధువని యర్థము. ద్విజబంధువునకు శివునిచే సమ్మతింపఁబడిన ఈ మహామంత్రమును శ్రౌతశైవాచారసంపన్నుని అర్ధాంగికి-ప్రణవరహితముగ నుపదేశింపవలెననుట-శివాపచారములలో అగ్రగణ్యమగుచున్నది.

శ్లో॥ నారీవాఽథ నరోవాఽథ-బ్రాహ్మణోవాఽన్య ఏవ వా।
నమోంతం వా నమఃపూర్వ-మాతురః సర్వదా జపేత్॥

శివమహాపురాణము-విద్యేశ్వర సంహిత సప్తదశాధ్యాయము.

స్త్రీగాని, పురుషుఁడుగాని, బ్రాహ్మణుఁడు గాని, ఇతరుఁడు గాని, నమోఽంతముగ నైనను నమఃపూర్వకముగనైనను పంచాక్షరీమంత్రమును జపింపవలెను. జ్వరాదులచే ఆర్తుఁడగువాడు-ఎల్లకాలము జపింపవచ్చును. ఇట్లు సర్వసామాన్యముగ శివభక్తులందరికి అధికారము కలదని నిరూపించి-అదే శివమహాపురాణము-వాయవీయసంహితలో ఉత్తర భాగమున ఏమంటున్నదో ప్రణవ నిషేధవాదులు గమనింపగలరు!

శ్లో॥ అస్వాతంత్ర్యకృతో దోషో-నేహాస్తి పరమార్థతః।
శివధర్మే నియుక్తాయాః-శివశాసనగౌరవాత్ ॥ 70
బహునాఽత్ర కిముక్తేన-యోఽపి కోఽపి శివాశ్రయః।
సంస్కార్యో గుర్వధీనశ్చ-త్సంస్క్రియా న ప్రభిద్యతే॥

"ఈ శివదీక్ష విషయమై-అస్వతంత్రతవలన కలుగు నిర్బంధము-వాస్తవమును విచారించినచో-లేదని తెలియవలెను. శివధర్మపరాయణురాలగు స్త్రీ-శివదీక్షను స్వతంత్రముగా తీసికొనవచ్చును-పెక్కు చెప్పనేల? కరుణామయుఁడగు శివుని శాసనము నాదరించి-శివాశ్రయుఁడగు ఏ మానవుని కైనను శివదీక్ష నొసఁగవలెను. ఇట్టి శివదీక్షాసంస్కారము గురువుచే చేయఁబడునెడ-స్త్రీ పురుషులకు సంస్కారము భిన్నము కాజాలదు.

స్త్రీ పరతంత్రురాలైనను శివధర్మములగు భస్మరుద్రాక్ష ధారణ శివమంత్రజప లింగధారణాదుల నవలంబించునెడ-ఆమెకు అస్వాతంత్ర్యము దూరమై స్వతంత్రముగ శివు నుపాసింప నర్హత కలుగును. అట్టితటి ఆమె గురు సంస్కృతయైనచో-పురుషునకు తనకును వైదికసంస్కారమొక్కటే గాని వేరు కూడదని ఇఁట విదితమైనది.

ఇంకను కారణోత్తరము క్రియాపాదమునందు ఏమంటున్నదో దిగువ చూడుడు?

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థో వా-వనస్థోఽథ యతిస్తు వా।
యోషిద్వా పరిగృహ్ణీయాత్-సద్యోముక్తిం యదీచ్ఛతి ॥

"ఈ జన్మాంతముననే మోక్షము నపేక్షించునెడల— బ్రహ్మచారి గాని, గృహస్థుఁడు గాని, సన్న్యాసి గాని, స్త్రీ గాని శాంభవదీక్షఁ బరిగ్రహింపవలెను.

ఇఁట "స్త్రీ స్వతంత్రముగా పరతంత్రముగా వైదికముగా తాంత్రికముగా" అను వివక్షలేకుండుట గమనార్హము. గురువుచే ఉపదేశింపఁబడు షడక్షరీమహామంత్రము గలది—మనుదీక్షకాగా-దీక్ష వైదికముగాను, మంత్రము ప్రణవరహితమై అవైదికకల్పముగాను ద్విజస్త్రీలు గూడ స్వీకరింపవలెనని స్త్రీ ప్రణవనిషేధవాదులు చేయు అపవ్యాఖ్యానము అపహాస్యాస్పదమైనది.

శ్లో॥ సంకల్పాధికృతి స్త్రాంసా-నాస్తి స్వర్గ్యేషు కర్మసు ।
సిద్ధా విమోక్షాధికృతి-ర్న నిరోద్ధుం హి శక్యతే ॥ 65
నారీత్వ మైహికం వాపి-భార్యాత్వం కల్పితం తథా ।
విరుంధతః కథం తన్వ్యాః-పంథానం మోక్షగామినః ॥
కారణోత్తరము-క్రియాపాదము

"స్వర్గాదిపుణ్యలోక ప్రాప్తికై చేయఁదగిన పుణ్య కామ్య కర్మలయందు స్త్రీ యస్వతంత్రముగ సంకల్పించు అధికారమ్ముండదు. మోక్షమునకై వలయు శాంభవదీక్షఁ బరిగ్రహింప నధికారమును నిరోధింప నెవరికని శక్యముకాదు" "స్త్రీత్వము ఈ జన్మకు సంబంధించినదై—భార్యాత్వము ప్రస్తుతము ఏర్పడినది" అను దృష్టిగలవారు-మోక్షము నపేక్షించు స్త్రీల

యొక్క శివారాధన పద్ధతి నెట్లు నివారింపనగును? ఎవరికి నలవిగాదనియు స్త్రీలు స్వతంత్రించి సద్యోముక్తి ప్రదమగు లింగధారణదీక్షఁ బరిగ్రహించి-ప్రణవపంచాక్షరిని జపించుచు శివు నర్చింపవలె ననియు ఇఁట వ్యక్తమైనది

శ్లో॥ తస్మా ద్దధికృతాం వేదే-త్వత్రానధికృతా మపి।
మదీయ మూలమంత్రేణ-పూజనం సర్వతో వరమ్॥ 6

వేదమునందు అధికారము గలవారు, లేనివారును నా మూలమంత్రము (ప్రణవషడక్షరి)తో నన్ను పూజించుట-అన్ని విధముల శ్రేష్ఠమగును. ఇఁట స్త్రీ పురుష వివక్ష లేకుండుటను ప్రతివాదులంగీకరింతురా? మహోపాధ్యాయ శివశ్రీ॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు-నీలకంఠీయ బ్రహ్మ సూత్రభాష్యమునకు వ్రాసిన సంస్కృత వ్యాఖ్యానమున శాస్త్రయోనిత్వాధికరణమునందు 83వ పుటయందు పదునెని మిది విద్యల నుల్లేఖించుచు "వైదిక దేవతారాధనప్రకార విశేష ప్రతిపాదకానాం శివాగమానాం ధర్మశాస్త్ర శబ్దేన గ్రహణమ్" "వైదికముగా దేవతారాధనవిధాన విశేషములను ప్రతిపాదించు శివాగమములు ధర్మశాస్త్ర మనఁదగినవి" అని తెలుపుటచే-శివాగమములు స్మృతులై వేదతుల్యములగునని విదితమగుచున్నందున శివాగమములు క్వచిత్ నిర్దేశించిన స్త్రీప్రణవాధికారనిషేధమును ఉపనిషత్తులు ఆమోదింపకుండుటఁజేసి-నిషేధాభావమే బలవత్తరమైనదని తేటపడినది.

శ్రీ మహాగణాధిపతయే నమః

# నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యగత శివలింగ ధారణ ప్రామాణ్యమ్

అధ్యాయం 3, 4వ పాదం, సూ. "మౌనవదితరేషా మప్యుపదేశాత్" పుటలు-696, 697, 698, 699.

అధర్వశిరసి శ్రూయతే "తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలం-బుద్ధ్యా సంచిన్త్య స్థాపయిత్వా చ రుద్రే। రుద్ర ఏకత్వ మాహుః, రుద్రం శాశ్వతంవై పురాణ మిషమూర్జం తపసా నియచ్ఛత-వ్రతమేతత్ పాశుపతమ్".

ఊర్జం=ఊర్గ్వై అన్నమితి వివరణాత్ పార్థివం, ఇషం=ఇష్టలింగం, తపసా=దీక్షయా, నియచ్ఛత=బిభృత। ఇతి ఇష్టలింగధారణం విహితం.

బృహజ్జాబాలాదిషు

"మృత్యుతారకం గురుణా లబ్ధం కంఠే బాహౌ శిఖాయాం వా బధ్నీత" మృత్యుమయ సంసారసాగరాత్తారకం,

కాలాగ్నిరుద్రోపనిషది
"వ్రతమిదం పాశుపతం, పశుపాశవిమోక్షాయ"
ఇష్టప్రాణభావాత్మకమేవ మహాలింగం
అపిచ నార్చిరాదిగతి మంతరేణ జ్యోతిషః పరస్యోప సంపత్తిః

నాపి మూర్ధన్యనాడ్యా నిష్క్రమణ మపహాయ సిద్ధ్యత్యర్చిరాదిగతిః, నైవ బహిరంత శ్చేష్టాదిరూపేణ క్రియమాణస్యోపాస్యమానస్యచ మహేశితుః ప్రసార మంతరేణ మూర్ధన్యనాడీద్వారస్య ప్రకాశనం చోపలభ్యతే.

కిముక్తం భవతి? కల్యాణ గురు కరుణోపలబ్ధ స్వేష్టాది రూపస్య పరమేశ్వరస్య పరమప్రసాదేన మూర్ధన్యనాడీద్వారేణ నిష్క్రమ్య దేవయానేన పథా పరంజ్యోతి రుపసంపన్న స్యైవ స్వస్వరూపాభినిష్పత్తిరూప పరమముక్తి రితి। అతోమూలం ముక్తేః పరమేశ్వర పరమప్రసాదకరం భస్మరుద్రాక్ష శివ లింగధారణాత్మకం పాశుపతవ్రత మితి''.

శ్రీ మహాగణాధిపతయే నమః

# శివపూజావిధి, స్త్రీశివపూజావిధి సహితము ఆరాధనవిధి

అను గ్రంథములోని కొన్ని అంశముల దౌష్ట్యము, తన్నివారణమున్ను

**తొలిపలుకు** - నవీనశాస్త్రవిజ్ఞానము ఇత్యాదిని నవీన శాస్త్రమును వీరు కల్పించిరి కాబోలు; స్త్రీ శివపూజావిధి-కారణోత్తరసారమను నంశము—విచారణీయము. ధర్మశాస్త్ర

మున భార్యకు చెప్పఁబడిన కర్మాధికారమును త్రోసి పుచ్చుట- వీరి నిరంకుశప్రజ్ఞకు నిదానమగును. ఇది లోకాచార విరుద్ధమైనను అశాస్త్రీయము కాదు. కట్టు బొట్టు జుట్టు- సామాన్య ధర్మములైనను వైదికములుగాక- లౌకికములైనచో-ప్యాంటు షర్టు మున్నగువానిని ధరించుట భారతీయ బ్రాహ్మణ ధర్మమని నిరూపింతురా ? వైదికవేషములేని మాహేశ్వరలకు వైదిక లింగధారణము శాస్త్రవిహితమని ప్రతిపాధించు బలము కలదా ?

సదాచారములేని మతము అవైదికమగును గదా !

ఈ గ్రంథముద్రణమునకు గురుద్వేషము కారణమని చెప్పలేక- ఫలాని శాస్త్రిగారు కారణమని- ధన్యవాదములను- ఎత్తిపొడుపుగా ప్రకటించుట- మాహేశ్వరాపచారమైనది.

శివజ్ఞానము-ముక్తస్థితిలో కోటిసూర్యప్రభా సదృశమై అనుట - ప్రశస్తముకాదు. "కోటి సూర్యప్రభాసంపన్నమై" అని వ్రాయవలెనని-గ్రంధకర్తకు తెలియమ కాబోలు. బ్రహ్మ తేజనాదముల" అనునది అపశబ్దమగుటచే 'తేజోనాదముల' అని వ్రాయకుండుట - అనభిజ్ఞతను సూచించును. అమూర్త లింగము వేరు, ఓంకారాత్మకలింగము వేరనుట-అవివేకము. ఓంకారాత్మకలింగమును ద్విజస్త్రీలు పూజింపవచ్చునా ? తథా సతి-ప్రణవాధికారము నవిధిగా ప్రతిపక్షులంగీకరించినట్లగును. ప్రణవరహిత పంచాక్షరి-స్త్రీలను తరింపఁజేయదేమో;

కాశీ క్షేత్రమున విశ్వనాథుఁడు-జీవి-శరీరములోని కుడి చెవిలో ప్రణవ పంచాక్షరి నుపదేశించువాడని కాశీఖండాదుల నిర్వచనమునకు సూక్ష్మశరీరమునకు ప్రణవ నాదోపదేశముఁ జేయునను అన్వార్థమును కల్పించి అట్టు స్వప్రమాణముగ నిరూపించువారిని అల్పమేధావులనుట- తమ అల్పజ్ఞతను చాటుచున్నది. సక్రమపూజాపరుని ప్రారబ్ధము బాధింపద నునెడ- ప్రారబ్ధ భోగరూపమగు శరీరస్థితియే పొసగదు గావున- సుఖదుఃఖానుభవము లేమి. తత్కాలముననే శరీర పాతము కావలెను. సక్రమ శివపూజాపరుని ప్రారబ్ధమనుస రించునదియేను, శివజ్ఞానము పరనాదాత్మకమనునెడ- అపర నాదమును నిరూపింపవలసివచ్చును.

శివజ్ఞానము-పరనాదానుసంధానాత్మకమని గ్రంథకర్త-సవరణఁజేసికొనుట - తన భావదోషమును తొలగించును. యథావకాశము చరుని పూజింపవలెనని వ్రాసినవారు- చరు నీర్ష్యతో దూషించుట స్వయంకృతాపరాధమగును.

శైవులకు తీర్థయాత్ర నిషిద్ధమని చెప్పుచు - శ్రీశైల మున ఇష్టలింగమును పూజించి మల్లికార్జునస్వామికి మ్రొక్క వలెననుట- స్వవచనవ్యాఘాతమైనది.

శివాగ్ని బీజములు గల "హర" అనుదానికి "ఓం"అంత మందు గలది. "హరఓమ్" అనునదగును. ఇది పంచాక్షర మూలమగు ప్రణవము- స్వరూపముగా గలదని "మూల

పంచాక్షరీ ఆత్మా యస్య-తస్మై" అను వ్యుత్పత్తి తో "హరాయ పరమాత్మనే" పరమాత్మయగు హరునికొరకు నమస్కారము అను ద్వితీయనిర్వచనముండగా- పంచాక్షరమునకు పంచాక్షరము మూలమనుటలో ఆత్మాశ్రయదోషము కలదని గుర్తించి అపవ్యాఖ్యలను మానుకొనుట శ్రేయస్కరము ప్రణవము అంతముగాగల పంచాక్షరిని యతులు జపింపవలెననుట అల్పమేధావిలసితము. సూక్ష్మపంచాక్షరియగు ప్రణవమును యతులు జపింపవలెననుట-లోకవేదప్రసిద్ధముకాగా "నమఃశివాయ"తో ఓంకారము తాదాత్మ్యముఁజెందుననుట ప్రకృతిని తనలో లీన మొనర్చుకొను శక్తిగల ఓంకారము- లోపించునని చెప్పినట్లగును గాన- మంత్రాపచారము తాలసిల్లినదని చెప్పవచ్చును. ఓంకారము లోపించుట నిజమైతే "నమఃశివాయోమ్" అని ద్విజస్త్రీలకు ఉపదేశింపవచ్చుగదా! "హర" అనుదానికి "ఓం" తగిలించినచో "హరౌం" అగును గాన అది అపశబ్దమగును "హర"కు అంతమందుగల "ఔం" "హ"కు తగిలించి హ్రౌం అగుననుట స్వకపోలకల్పితమైనది "నమఃశివాగ్ని బీజాయ" ఇత్యాది శ్లోకమునకు అపార్థము - అల్పజ్ఞతను సూచించును.

శక్తివిశిష్ట శివుఁడు అవిభాజ్యస్థితిగలవాడగుచుండగా- విశిష్ట శివుఁడు అర్ధనారీశ్వరుఁడు కారణమని చెప్పుట- శివుని స్థూలరూపములలో పదునాలుగవది అర్ధనారీశ్వరరూపమని- "త్రయోదశం హరేరర్ధ-మర్ధనారీ చతుర్దశమ్" అను వాతూలాగమసూక్తిని విరోధించినది.

సూక్ష్మస్థూలదశలు చిచ్ఛక్తికే గాని శివునకుండవు. తర్హి-సూక్ష్మస్థూలశక్తులతో నవినాభావముగల శివుఁడు కారణ కార్యములగునని శ్రీ నీలకంఠాచార్య నిర్వచనము. మానవుఁడు పూర్వదుష్కృతముల వలన జన్మించునని అంటూ గూడ ప్రారబ్ధము మానవుననుసరింపదనుట- హాస్యాస్పదమైనది. పూర్వపాపఫలముగా వ్యాధులు సంభవించునని వ్రాస్తూ వ్యాధిబాధలను ఈ జన్మయందలి శివాపచారఫలితముగా అనుభవింపవలసివచ్చుననుట - కర్మసిద్ధాంతపరిజ్ఞానాభావమును జైమినీయ కర్మవాదమును తెలియని అవివేకమగుచున్నయది. "ధర్మేణ పాప మపనుదతి" అనువాక్యము పూర్వసంచితమును పోగొట్టుననుటలో తాత్పర్యము గలదని ప్రతివాదులంగీకరింతురా ? "హరోం" తప్పు "హర ఓం" ఒప్పు, కాగా- నంది శృంగమధ్యనుండి "హర ఓం" అని మూడుమారులుచ్చరించి శివుని దర్శింపవలెనని-శాస్త్రమునందు ప్రోక్తము ఇష్టలింగమును పూజించి "హరఓం" అనుచు ఎనిమిది పర్యాయములు ఉచ్చరించుచు మ్రొక్కినచో అష్టబంధములు తొలగునని- శివహృదయస్థానీయమైన శివమహాపురాణము- ఉద్ఘోషించినది.

గురుచరేశ్వర సేవాశీలుఁడు - గురువులను, చరులను దురుక్తులతో సమక్షమున తిరస్కరించుట - సేవాశీలత్వమగునా ? "సేవా" అనుచో "తిరస్కార" అనినచో సరిపడుచుండెడిది.

ఆచమనములో ఇరువదినాలుగు శివనామములను వ్రాయ కుండుటయు విచారణీయమేను, కేవలము ప్రణవజపమును స్త్రీశూద్ర ద్విజబంధువులకు వేదవ్యాసుఁడు నిషేధించి-ద్విజ స్త్రీలకు ప్రణవ పంచాక్షరీ మహామంత్ర జపాధికారము కల దని- శివమహాపురాణమున-విద్యేశ్వర సంహితయందు ఏకా దశాధ్యాయమున- "ప్రణవేనాది సంయుక్తం- బ్రాహ్మణానాం విశిష్యతే-విప్రస్త్రీణాం నమఃపూర్వ-మిద మిచ్ఛంతి పండితాః" 48వ శ్లోకమున నిర్వచించుటచే- ప్రణవనిషేధము ద్విజేతర స్త్రీలకు చేయఁబడినదని తెలియుచున్నది. ఏవో రెండుమూడు ఆగమాలు చదివి- వానిలో కొన్నిటిని కల్పించి పామరులను వంచింపరాదు.

లింగధారణము వైదికమని యంగీకరించి వికల్పప్రాప్త మగు ప్రణవపంచాక్షరిని నిషేధించి స్త్రీలకు ప్రణవరహిత మగు పంచాక్షరి నుపదేశింపవలెనని గురువులను శాసించుట- ప్రజ్ఞావాదమగును. శ్రుతిస్మృతులకు విరోధము సంభవించు వెడ- శ్రుతియే ప్రమాణమగునని వ్రాసిన గ్రంధకర్త-చంద్ర జ్ఞానములోని ప్రణవనిషేధమును చెప్పనట్టి ఉపనిషద్వాక్యము లను నిరాకరించుట— స్వవచనవ్యాఘాతమైనది.

మైత్రేయి గార్గేయి మున్నగు స్త్రీలు ఉపనిషత్తులలోని ప్రణవమును విసర్జించి చదివినారా? మంత్రములు వైదిక ములు గదా! సప్తకోటి మహామంత్రమూలమగు శివపంచాక్షరి వైదికమని అంగీకరించి తన్మూలమగు ప్రణవమును ద్విజ

స్త్రీలకు నిషేధించుట- గ్రంధకర్తగారి స్త్రీద్వేషమూలమగు చున్నయది. శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి- శివపంచాక్షరీ మహామంత్రార్థమున "హ్రీం నమఃశివాయ" మూలమున లేకుండుటయు, అర్థముననుండుటయు గమనార్హములగు చున్నవి. కేనోపనిషత్తున అమరులకు సాక్షాత్కరించిన దేవి హ్రీం స్వరూపురాలు కాదు. "హ్రీః" అను పదముచే చెప్పఁబడు హైమవతి గోచరించినది. పండిత ప్రకాండులైన గ్రంధకర్తగారి జ్ఞానము- మానవ జ్ఞానాతీతమై అపరిమితముగ నున్నదని వారి వ్రాతలో స్ఫురించుచున్నది.

శివపూజావిధిలో- శంభవేస్వాహా ఇత్యాదిని "స్వాహా" ను చేర్చుట విహితముకాదు. "నమః" అని చేర్చుట- విహితము. పైగా- ఆచమనాధికారము స్త్రీలకు లేదని వ్రాసిన గ్రంధకర్తగారు ఆచమనమును- పూర్వలిఖితమును విస్మరించి-విధించుట - అశాస్త్రీయ స్వీయ పాండిత్యప్రతిభ కావచ్చును. వామకరతలము న భస్మాసనమును 'హ్రీం'తో వ్రాయవలెనని గ్రంధకర్తగారు నిర్దేశింపకుండుట-స్వమేధా సంపద్విలాస పూరితమైనది. శివాష్టోత్తర శతనామారంభమున "ఓం" వ్రాసి- స్త్రీలు "ఓం" లేకుండ పఠింపవలెననుట- కేవలము స్త్రీల మేలునకై గ్రంధరచనను సాగించు వీరి యుద్దేశమునకు భంగకరమైనది. శివకవచాంగన్యాసమును "ఓంనమో భగవతే" అనుదాని మొదలుతో చూపెట్టినందున స్త్రీలు శివకవచమును చదువరాదని నిషేధించినట్లైనది. తథాపతి-పురా

ణాధికారముగూడ స్త్రీలకు లేదని ఋజువగునుగదా! ఆరాధన విధిలో సంకల్పమున గల "ఐక్యాహాఖ్యారాధనం ప్రసాదేన హవిషా, సంకల్పవిధానేన, అర్ధమాతృక పరిపూర్ణ కిరణావరణ మహేశ్వరస్వరూప బిందునాద కళావిధానేన సద్దైవం" అను వాక్యమునకు విశదార్థమును గ్రంథకర్తగారు వ్రాయవలసియుండెను. ఎందుకో మంత్రశాస్త్ర నిపుణులు వ్రాయలేదు. 31వ పుటయందు "హే పితృాన్ స్వదేశం గచ్ఛ" అని వ్రాయుట శబ్దజ్ఞానాభావమును తెలుపుచున్నది. "హే పితరః! స్వస్థానం గచ్ఛధ్వం" అని యుండవలసినది. "కమలారాణి సంఘి"గారు "వార్త"లో వ్రాసిన స్త్రీప్రణవ నిషేధమును - ఓంకార ప్లుత నిషేధపరముగ – మనవారు గ్రహింపలేకుండుట-శోచనీయము. జ్యోతిర్లింగాన్యతమమగు ఓంకారేశ్వరుని నామము నుచ్చరించుటగాని దర్శించుటగాని ద్విజస్త్రీలకు కూడదనుటకుగూడా ప్రతివాదులు సాహసింతురు. ఆహా! ఏమి వారి దురాగ్రహము ?

---

దీనిని చదివి అవగాహనఁజేసికొనియు తమ సంశయవిచ్ఛేదము గల సదభిప్రాయమును త్వరలో వ్రాసి పంపగలరని శైవమహాజనుల నభ్యర్థించుచున్నాను.

శ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు

శ్రీ మహాగణాధిపతయే నమః

# కర్మభోగ వివరము

శ్లో॥ బీజాంశ శ్చైవ వృద్ధ్యంశో-భోగాంశః పుణ్యపాపయోః।
జ్ఞాననాశ్యో హి బీజాంశో-వృద్ధ్యంశోఽన్యాభివృద్ధితః॥
భోగాంశో భోగనాశ్యస్తు-నాన్యథా పుణ్యకోటిభిః।
శంభుపూజాతపోఽధిక్యాత్-భోగఃసహ్యోభవేచ్చిరాత్॥

శివపురాణం-విద్యేశ్వరసంహిత, ద్వాదశాధ్యాయము.

బీజాంశ (సంచిత)ము, వృద్ధ్యంశము (ఆగామి) భోగాంశ (ప్రారబ్ధ)ము నని కర్మ-మూడు విధములు గలది కాగా-బీజాంశము—శివమంత్రజప పూజాధ్యానములతో నశించును. వృద్ధ్యంశము- పాపాధిక్యముతో పుణ్యము, పుణ్యాతిశయముతో దురితము నివర్తించును. భోగాంశము—అనుభవముతోడనే దూరమగును. అట్లుగాక-కోట్లకొలది పుణ్యములనాచరించినను భోగాంశము లేనిది కాదు. ఐతే శివుని పూజించుట శివషడక్షరీ మహామంత్రాది జపము అను తపస్సు-అతిశయమగునెడ- భోగము- అలస్యముగా ఓర్చుకొన నలవి గలద (సహ్యము) గును.

ఇట్లు ప్రమాణములు చెప్పుచుండగా—ప్రారబ్ధము-శరీర

వియోగాత్ పూర్వమే నశించునని చెప్పుట-ఎంతటి అవివేకమో చదువరులు గమనింతురు గాక! శరీరముతో జీవాత్మ కర్మ ననుభవించును గాన ప్రారబ్ధప్రాప్తమగు శరీరము లేనిది కర్మానుభవము కాజాలదు. అందువలన శరీరమునకు ఆహార పానీయాదులు ఉన్నను ప్రారబ్ధకర్మ ఉండదని నిర్వచించుట చోద్యముగా నున్నయది.

ఇట్టి అశాస్త్రీయవాదముల నెన్నిటి నికముందు ప్రతివాదులు వ్రాయుచు అమాయిక ధనికుల ధనమును ఆకర్షించి పొత్తములనెన్నిటి నచ్చొత్తింపఁజేయుదురో అని నిరీక్షించి ప్రతివాదుల దుర్వాదముల నుపేక్షింపవలసి వచ్చునేమో; ఈ ఘోరకలికాలమున ఓంకారము సినిమాలలో బోర్డులపైనను బస్తాలపైనను సర్వజనుల వదనములయందును వ్యవహార నామములలోను రోహిణీనక్షత్రగత ప్రథమచరణమునందును భజనలయందు పాటలలోను పామర గ్రంథములలోను అకాండ తాండవము చేయుచుండగా ద్విజస్త్రీలకు గూడా ప్రణవాధికారము లేదని అప్రసిద్ధప్రమాణములను చూపుచు ప్రతివాదులు-శివమంత్రదీక్షాపేక్షలగు ద్విజస్త్రీలను నిరుత్సాహపఱచుచు సంఘదౌర్బల్యము నావహింపఁజేయుచున్నవారు.

ఇట్టి దుశ్చింతనమును పరమేశ్వరుఁడు త్వరలో తొలగించి శైవలోకకల్యాణము నొనఁగూర్చుగాక! ఇందువలన ఆరాధ్యస్త్రీలు తమ ప్రణవపంచాక్షరీ జపానధికారమునుగూర్చి

పరితపింపక-యథాపూర్వము ప్రవర్తింతురుగాక! ప్రతివాదుల యొక్క-తెలిసితెలియని మాటలను నమ్మక-స్వధర్మమును ఆరాధ్య స్త్రీపురుషులు రక్షించుచు కృతార్థులగుదురు గాక! ప్రణవపంచాక్షరీమంత్రమును ద్విజస్త్రీలు జపించుట-శివాప చారమగునని భయపడి-గురూపదిష్టప్రణవమును విడువకుం దురుగాక! ప్రణవపంచాక్షరీజపము స్త్రీలకు విషతుల్యమగు ననియు, ఉపదేశించిన గురువునకు అనర్థమగుననియు నిర్వ చించు ప్రమాణములు-నహి నిందాన్యాయమున-వేదాధికారము గల బ్రాహ్మణక్షత్రియ వైశ్యుల సహధర్మచారిణులకుగూడ వేదాధికారము అనుషంగికముగా సంప్రాప్తించు ననుటలో తాత్పర్యముగలవని-గుర్తించి శైవలోకము తమ కర్తవ్యము లను భక్తిశ్రద్ధలతో నిర్వహించుచు భావితరమువారికి-నాస్తి క్యము రాకుండునట్లు-ప్రబోధించి సంఘశ్రేయస్సు నొనం గూర్తురు గాక!

శివశ్రీ॥ కై. వా. ముదిగొండ నాగలింగశాస్త్రి కృత- శివపంచాక్షరీ మహామంత్రార్థ గ్రంథమున 44వ పేజీయందు "తవాపి మూలమంత్రోఽయం - కించిద్భేదసమన్వయాత్। తస్మాదనేన మంత్రేణ మనోవాక్కాయశుద్ధితః॥ ఆవయో రర్చనం కుర్యా-జ్జపహోమాదికం తథా" "దేవీ-ఈ పంచాక్షరీ మంత్రము కొద్ది భేదముతో నీ మూలమంత్రమగును గాన ఈ నీ మంత్రముతో త్రికరణశుద్ధిగా మనయిద్దరిని పూజించుటే గాక జపహోమాదుల నొనర్పనగును" అని యుండుటయు,

"కించిద్భేదసమన్వయాత్" అను దానికి "హ్రీం" అను బీజా క్షరముఁదగు సమన్వయముతో "హ్రీం నమః శివాయ" అను నది-గౌరీపంచాక్షరి యగునని యర్థమున వ్రాయుటచేతను గౌరీపంచాక్షరిని జపింపని యెడల ప్రత్యవాయముండునని చెప్పకుండుటఁజేసియు ఇది నిత్యముగాక కామ్యమగునని తేట పడుచున్నది గౌరీపంచాక్షరితోశక్తిశివులనర్చింపవలెననుటలో హ్రీంబీజవాచ్యురాలగు శక్తికి ప్రాధాన్యము లేదను సంశము ఇమిడియున్నది. "హ్రీం నమః శివాయ"ను తప్పక గురూప దిష్టముగ స్వీకరింపవలెనను విధి గానంబడుట లేదు. ద్విజస్త్రీ లకు గూడా "హ్రీం నమః శివాయ" అను మంత్రము ముఖ్యమైనచో "హ్రీం" బీజమునకు రూపవర్ణాదులు చెప్పఁబడి యుండెడివి. శాంభవదీక్ష-మోక్షమునకై -స్వీకరింపఁబడునది గాన దీక్షాప్రధానాంగమగు ప్రణవషడక్షరీస్వీకారము. లింగ ధారణమువలె వైదికమగుటచే ద్విజస్త్రీపురుషులందురును ప్రణవషడక్షరీజపమునే చేయవలెనని విదితమగుచున్నది. పురుషులకు ఉపనయనాత్పూర్వము-స్త్రీలకు వివాహాత్ పూర్వము శాంభవదీక్షాస్వీకారము నిషేధింపఁబడుటచే ఈ లింగమంత్రధారణాదికముయొక్క వైదికత్వమునకు వికల్ప మును నిరూపించుట-బహుప్రమాణవిరుద్ధమైనది. ఉపనిషత్తు లలో లేని నిషేధమును చూపెట్టు ప్రమాణములు తాంత్రికాం శము ననువదించి- వేదానధికారులగు ద్విజేతరస్త్రీ శూద్రాదుల కొరకు ఉపయోగపడుని ప్రతివాదులు గ్రహింతురు గాక!

ప్రతివాదుల మనఃసమాధానమునకై దిగువ కొన్ని ప్రమాణములు ఉదాహరింపఁబడినవి.

శ్లో॥ పరమాత్మా మనో ర్జేయః—సోఽహం రూపః సదాశివః।
జాయతే సహయో ర్లోపా-దోమిత్యేకాక్షరో మనుః ॥
శైవ సిద్ధాంత శిఖామణి-నవమపరిచ్ఛేదము

ప్రణవ (ఓమ్) మంత్రమునకు సోఽహం స్వరూపుఁడగు సదాశివుఁడు—అధిష్ఠానదేవత కాగా "సోఽహమ్"లోని "స" "హ" అను రెండక్షరములు లోపించుటవలన "ఓమ్" అను ఏకాక్షరమహామంత్రము- "నమః శివాయ"కు మూలమై సూక్ష్మపంచాక్షరమనఁ బఱగుచున్నయది.

సూక్ష్మాగమమున-తృతీయపటలమునందు-

శ్లో॥ అల్పవర్ణసమాయుక్త-మధికార్థ మసంశయం।
సారా త్సారతరం శైవం-వాక్యం మోక్షైకకారణమ్॥

మదేకశరణా యే చ-మదారాధనతత్పరాః।
అపివేదవిరుద్ధాశ్చ-త ఏవాత్రాధికారిణః॥

కొద్ది అక్షరములు గొప్ప అర్థము గలది, సకలశాస్త్ర సారమగు వేదమునకన్న శ్రేష్ఠంబు, శివశబ్దఘటితమునగు "ఓం నమఃశివాయ" అను వాక్యము మోక్షమునకు ఏకైక కారణము కాగా-నన్నే శరణముగ భావించి శాంభవదీక్షితులై అనివార్యముగ నిత్యము మజ్జనతీర్థస్వీకారాదుల నవలంబించి నన్ను పూజించుటలో తత్పరులగువారు-అవైదికులైనను ఈ

Leeuwo 2 2009



ప్రణవషడక్షరీ మహామంత్రమును జపించుటయందు అధికారము కలిగియుందురు.

శివశ్రీ॥ తాడికొండ నాగమల్లయ్యగారు గుంటూరునుండి 23-1-1978వ తేదీన వ్రాసిన లేఖలోని "శివాద్వైతభాష్యార్ణవాధ్యక్ష" బిరుదము మీపట్ల కడుంగిడు సమయోచితమై "అపిచ పశుపతిః సర్వదేవప్రకృష్టః" అను శీర్షికతో బ్రహ్మపదమునకు "శివశబ్దమే" ముఖ్యార్థ సూచకంబగునని నిర్వచించుటఁ జూడ శ్రీ ముదిగొండ శంకరారాధ్యులవారో శివయోగి శ్రీ నాగలింగశాస్త్రిలవారో జన్మించి శైవమతోద్ధరణఁ జేయుచున్నట్లు తోచెడిని" ఇత్యాది ప్రశంసావాక్యములు యథార్థములని నమ్మినందుకు-ప్రస్తుతము నా వ్రాతలను తిరస్కరించుటేగాక వ్యక్తిగత ఈర్ష్యతో సమక్షమునకేతెంచి దూషించుట పరిహారమైనదనియు ద్విజస్త్రీ ప్రణవాధికారప్రతిపాదకమగు గతానంతర(1995 జులైలో జరుపఁబడిన) శైవ మహాసభలలోని తీర్మానమునంగీకరించి చేవ్రాలు చేసియు చర్వితచర్వణముగా విరుద్ధవ్యాసములను ప్రతికూలగ్రంథములను వ్రాయుట- వ్యాజస్తుతిభరిత నిందాపరమైనదనియు; ఇందుకు కారణము మృగ్యమనియు- శైవమహాజనులకు నివేదించుచున్నాను.

నా ధర్మసందేహములను తీర్చు ధైర్యము గలవారు నాతో శాస్త్రవాదమును చేయగలరా?

"ఆరాధ్యశైవాః స్త్రీపురుషాః ప్రణవశివ పంచాక్షరజపేన సుఖినో భవంతు"

నిర్మల శంకరశాస్త్రి